

# నా జీవితం నాది కాదు

సృష్టికర్తని సృష్టికి అందించే ప్రయత్నం చేస్తున్న ఆన్ లైన్ మాస పత్రిక

My Life IS Not Mine

అవతార పురుషుడి 90 సంవత్సరాల (1925 -2015)
అనంత మౌన వార్షికోత్సవ సంబరాల ప్రత్యేక సంచిక

## మెహెరా మెహెర్

## స్కూల్ అఫ్ అవేకెనింగ్

బ్రతకడం జంతుత్వం -వ్యర్ధం
బ్రతికించడం మానవత్వం -అర్ధం
బ్రతుకునే ఇవ్వడం దైవత్వం -పరమార్ధం

సంచిక: 2
జూలై 2015

మూల్యం: అమూల్యం
సభ్యత్వం: అర్హత

## మిమ్మల్ని మిలోపలి తీసుకెళ్ళే ఈలోపల ఉండే విష-రహిత విషయాల సూచిక:



## ఎవరికి మాటలు?

ఆది నుండి ఆకాశం మూగది.
అనాదిగా తల్లి ధరణి మూగది.
నడుమ వచ్చి ఉరుముతాయి మబ్బులు.
ఈ నడమంత్రపు మనుషులకే మాటలు ఇన్ని మాటలు.
-ఓ భగవత్ ప్రేమికుడు



# {1}. అవతారుడి బాటలో హృదయపు ఆటతో కూడిన హఫీజ్ మాట/పాట

## {మౌనంగా }



హఫీజ్ బాబాకి ఎంతో ఇష్టమైన కవి.
బాబా చిన్నతనంలో తన తండ్రి అయిన షెరియార్జి యొక్క మధురమైన స్వరం నుండి వినేవారు.
బాబా ఎంత శ్రద్ధగా వినేవారంటే విన్న ప్రతీ పదాన్ని తిరిగి చెప్పేవారు.

(గ్లింప్సెస్ అఫ్ ది గాడ్ మాన్ 1-373/4)

పర్షియన్:

హఫీజ్ బా జఫ ఆజ్ తో షికాయాత్ నాను మాయద్
జాన్ రూ కే బా హర్ జూర్ ఎ తో లుట్ఫేస్త్ నిహాని

ఇంగ్లీష్:

And Like old Hafiz, I'll Never Complain
And Suffer in Silence My Sorrow and Pain.

తెలుగు:

క్రిత హఫీజ్ మాదిరిగా నేను ఎన్నడూ ఫిర్యాదులు చేయను.
నా బాధని, దుఃఖాన్ని మౌనంగా అనుభవిస్తాను.

**ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం**

**అనుకునేది, అనుకుంటూనే ఉండేది జీవ సంకల్పం.
జరిగేది, జరిపిస్తూనే ఉండేది దైవ సంకల్పం. -సూఫీ**



## {2}. మెహెర్ ప్రభులోని ఆణిముత్యాలు {మౌనాన్ని గమనించు}

న్యూర్ గావొంకర్ కొన్ని రోజులు మౌనంగా ఉండాలని ఉంది అని బాబా కి తెలియచేస్తాడు.

ఇంకా బాబాని ఈ విధంగా ప్రశ్నిస్తాడు:
ఈ మౌనంగా ఉండే కాలంలో బాబా తనకి భగవంతుడి గురించి మాత్రమే మాట్లాడే మినహాయింపును ఇవ్వమని కోరాడు. దానికి బాబా ఆమోదం ఇవ్వలేదు. బాబా అతనితో...

మౌనం అంటే మౌనం. ఒక వేళ నీవు మౌనాన్ని గమనించాలంటే పరిపూర్ణంగా గమనించు. మనస్సుకు దాని కుట్రలు ఆడడానికి గదిని కేటాయించకు. మనస్సు ఎల్లప్పుడూ నీ ఏక దిశాత్మక సంకల్పంలో అడ్డంకులు సృష్టిస్తూనే ఉంటుంది.

మనస్సు మార్గాలు వంచనతో కూడిన చాలా అంతు చిక్కనివిగా తప్పించుకోదలచినవిగా ఉంటాయి.

నీవు ప్రారంభంలో భగవంతుడి గురించి, ఆధ్యాత్మికత గురించి మాట్లాడతావు కాని ఈ కోరిక యొక్క మారువేషంలో మనస్సు నిన్ను నీ మౌనంతో విసుగు చెందేలా త్వరగా తయారు చేస్తుంది.

అప్పుడు పరోక్షంగా నీవు ఇతరులు నీ వద్దకు వచ్చి భగవంతుడి గురించి నీతో మాట్లాడాలని ఆశిస్తూ ఉంటావు.

తంత్ర గుణాలతో కూడిన మనస్సుకు నీకు అటువంటి పరిస్థితులని సృష్టించడానికి అందులో నిన్ను ప్రేరేపించడానికి అసాధ్యం ఏమీ కాదు.

మౌనాన్ని గమనిస్తున్నప్పుడు మనస్సును కూడా మౌనంగా ఉంచు.
ఈ మౌనం (అంతరిక మౌనం) బాహ్య మౌనానికి సహాయ పడుతుంది.

మనం చాలా మంది మూగ పిల్లలను చూస్తుంటాము కాని అక్కడ లభ్యమయ్యేది ఏమిటి -మౌనమా?

నీ హృదయాన్ని మరియు ఆత్మని నీ ముందస్తు ధ్యానంలో మరియు మౌనం యొక్క గమనంలో ఉంచు.

అక్కడే నేను ఉన్నాను -అక్కడే నీలో ఉన్నాను -నీకు సహాయ పడడానికి.

(లార్డ్ మెహెర్ పేజి.4651/2)



## నీ వారు కారు /కాలేరు

నీ ప్రారబ్ధానుసారం ప్రాప్తించిన
పనులన్నింటిని సక్రమంగా నిర్వర్తించు.
అయితే నీ మనస్సును మాత్రం భగవంతుడి
మీద కేంద్రీకరించు.
కుటుంబంలోని తల్లి తండ్రులు. భార్యా పిల్లలు
వీరందరితో ఉండు.
కాని నీ హృదయాంతరాళ్ళల్లో మాత్రం
వారెవ్వరూ నీకు సంబంధించిన వారు కారు,
కాలేరు సుమా అని తెలుసుకో.
-అవతార్ మెహెర్ బాబా

# {3}. సత్పురుషుల జీవితంలోని సంగతులు {మీరాబాయి -ఎవరు స్త్రీ? ఎవరు పురుషుడు?}

"నా ప్రేమలో మీరాబాయి వలె ఉంటూ పవిత్రంగా ఉండండి."
-అవతార్ మెహెర్ బాబా
(లార్డ్ మెహెర్ పేజీ.3381)

**మీరాబాయి మెహెర్ బాబాకు ఇష్టమైన సత్పురుషులలో ఒకరు.**



మీరాబాయి గిరిధర గోపాలునికి (శ్రీకృష్ణుడు) ఆత్మార్పణ చేసుకొన్నది. అందువలన మధురను విడిచి కృష్ణుడు విలాసానికి ఆటపట్టయిన బృందావనం చేరుకున్నది.

మీరా వెళ్ళినప్పుడు బృందావనంలో వల్లభాచార్యుడు అనే పండితుడు ఉండేవాడు. వారిని కలుద్దామని మీరాబాయి కబురు పంపింది. ఆయన తాను స్త్రీని చూడనని జవాబు పంపుతారు.

అప్పుడు మీరాబాయి "ఈ బృందావనంలో ఉన్న పురుషుడు ఒకే ఒక కృష్ణుడే. మిగతా వారందరూ స్త్రీలే. అలాగాక మరొకరు తనను పురుషుడు అని భావించుకుంటే శ్రీకృష్ణుడు బృందావనం విడిచి వెళ్ళవలసి వస్తుంది." అనే సమాధానాన్ని అతనికి పంపింది.

ఆ సమాధానంతో వల్లభాచార్యుడు ఆమె మహత్వాన్ని గుర్తించాడు.

## ***గిరిధరా***

||పల్లవి||
గిరిధరా గిరిధరా
గిరిధర ఏలరా కినుక నా మీద ||2||
ఏదయినా తప్పయినా మన్నించరాదా
గిరిధర ఏలరా కినుక నా మీద
ఏదయినా తప్పయినా మన్నించరాదా
గిరిధరా....

||చరణం-1||
నిఖిల సుగుణాలకు నెలవైన నా స్వామి ||2||
జన్మ జన్మలకు నీ చరణదాసిని కాదా ||2||
నీ చరణ దాసిని కాదా...
గిరిధర ఏలరా కినుక నా మీద
ఏదయినా తప్పయినా మన్నించరాదా
గిరిధరా....

||చరణం-2||
నీ రమ్య నామమే నిరతమ్ము జపియించు ||2||
మీరా ప్రభుడు గిరిధారియే కాదా ||2||
గిరిధారియే కాదా...
గిరిధర ఏలరా కినుక నా మీద
ఏదయినా తప్పయినా మన్నించరాదా
గిరిధరా..గిరిధరా..

-మీరాబాయి






**ప్రారబ్ధానికి శరీరం + పరమాత్మకి హృదయం = భగవత్ ప్రేమికుడి జీవితం**

# {4}. మనకి తెలియని అవతారుడు!

## {అవతారుడి చెంత జీవించి తరించిన ముగ్గురు మౌన యోగులు (గుస్తాద్జి ,దౌలత్ మాయి, బాల తంబత్)}





మెహెర్ బాబా కాకుండా 1927 సమయంలో మెహెరాబాద్ లో ముగ్గురు మౌనులు ఉండేవారు.

(1). గుస్తాద్జి {1891 -30/9/1958} (67 సం॥లు)
మౌన పయనం: 1/5/1927 నుండి 30/9/1958 (చివరి శ్వాస వరకు) (31 సం॥లు)

(2). దౌలత్ మాయి {1883-5/11/1952} (69 సం॥లు)
మౌన పయనం: 1933 నుండి 5/11/1952(చివరి శ్వాస వరకు) (19 సం॥లు)

(3). బాల తంబత్ -మౌన పయనం: 1925 నుండి తన చివరి శ్వాస వరకు.

# {5}. జ్ఞానేశ్వర్ మనందరికీ అందిస్తున్న జ్ఞానేశ్వరి {మౌనము}



(1).దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీష తామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥
{10వ అధ్యాయం (విభూతి యోగం) 38వ శ్లోకం}

శ్రీకృష్ణుడు అర్జునుడితో ఈ విధంగా పలుకుతున్నాడు:
పిపీలికాది బ్రహ్మ పర్యంతము గల అందరిని శిక్షించెడి దండము నేను. శాస్త్రములో మంచి చెడ్డలను నిర్ణయించే మరియు ధర్మ జ్ఞాన పక్షమున ఉండే నీతి శాస్త్రమును నేను.

మిత్రుడా అర్జునా, రహస్యములన్నింటి మౌనం నేను. ఎందుకంటే మౌన ధారులను బ్రహ్మ కూడా ఏమీ చేయలేడు.
జ్ఞానులందలి జ్ఞానమును నేను.ఈ విభూతులను ఎంతవరకు ఎంతవరకు అని వర్ణించేది! వీటికి అంతే లేదు.

(2).మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః ।
భావ సంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే ॥
{17వ అధ్యాయం (శ్రద్ధాత్రయ విభాగయోగం) 16వ శ్లోకం}

మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, మౌనం వహించడం, శాంత స్వభావం, ఆత్మ నిగ్రహం, అంతఃకరణ శుద్ధి కలిగి ఉండడం మనస్సుతో చేసే తపస్సు అవుతుంది.

# జ్ఞానేశ్వర్ గురించి అవతార్ మెహెర్ బాబా:

{జ్ఞానేశ్వర్ (1275 -1296)
-21 సంవత్సరాల 3 నెలల 5 రోజులు }

జ్ఞానేశ్వర్ యువకుడు.

ఒక అపురూపమైన మరియు ఏకమైన విషయం ఏమిటంటే ఆ కుటుంబంలోని వారందరూ సాక్షాత్కారం పొందారు.

జ్ఞానేశ్వర్ తన టీనేజ్ వయస్సులోనే సాక్షాత్కారం పొంది గురు భక్తి మీద అందమైన పదాలను రచించాడు.

జ్ఞానేశ్వర్ అన్నయ్య మరియు గురువు అయిన నివృత్తి. (1273-?)
జ్ఞానేశ్వర్ తమ్ముడు సోపాన్. (1277 -?)

జ్ఞానేశ్వర్ చెల్లెలు ముక్తాబాయి. (1279 -1297) -18 సంవత్సరాలు
ఈ నలుగురూ ఆత్మ సాక్షాత్కారం పొందినవారు.

వీరందరూ ఎటువంటి లోతైన అనుభవాన్ని పొందారో భగవంతుడికే తెలియాలి.
(లార్డ్ మెహెర్ పేజీ.3165)

**ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం**



## వంటింట్లో వేదాంతం

రమణ మహర్షి వంట వండుతూ తోటి సహచరులతో...
కూరగిన్నె పై మూత పెట్టు. ఆవిరి అణిగి పోతుంది. దానితో కూర రుచిగా ఉంటుంది.
అంటే మనస్సుకు మూత పెడితే ఆలోచనల ఆవిరి అణిగి పోతుంది. దానితో అహంకారం నాశనమై ఆత్మస్థితిలో నిలిచి ఆనదాన్ని పొందుతావు.



## {6}. ఓ నా పిల్లల్లారా! నన్నేమి అడగాలో /నన్నేమి అడగకూడదో తెలుసుకోండి

1.మీకు చక్కని ఉద్యోగం ఇప్పించమని నన్ను అడగడం గాక నన్ను మరింత శ్రద్ధతో, చిత్త శుద్ధితో సేవించాలని కోరుకోండి.

2. మీ జీవితాలను, మీకు ప్రియమైన జీవితాలను రక్షించమని నన్ను యాచించడం గాక మిమ్ములను స్వీకరించి నా కొరకు మీ జీవితాలను అర్పించడానికి అనుమతించమని నన్ను యాచించండి.

3. మీ శారీరక రుగ్మతలను నేను నయం చేయగలనని ఎన్నడూ ఆశించక మీ అజ్ఞానం నుండి విముక్తులను చేయమని కోరుకోండి.

-అవతార్ మెహెర్ బాబా

**ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం**

"నా మౌనం చాలా శక్తివంతమైనది మరియు ప్రగాఢమైనది.
నా మౌనం ద్వారా మీకు నేను ఇచ్చే సత్య, ప్రేమ సందేశాలు కూడా
అంతే స్థాయిలో శక్తివంతంగా, ప్రగాఢంగా ఉంటాయి. "
-అవతార్ మెహెర్ బాబా

## {7}. అవతారుడి విశ్వ కార్యంలోని ఇద్దరు ప్రకాశవంతమైన ఆత్మలు (హజరత్ ఇనాయత్ ఖాస్ & స్వామి వివేకానంద



### ఆదర్శవంతమైన మనిషి ఎవరంటే...?

గొప్ప మౌనం మరియు ఏకాంతం మధ్యనే ఉంటూ తీవ్రమైన కార్యాచరణను కనుగొనేవాడు. తీవ్రమైన కార్యాచరణ మధ్యనే ఉంటూ ఎడారి యొక్క మౌనాన్ని మరియు ఏకాంతాన్ని కనుగొనేవాడు. అతడు నిగ్రహపు రహస్యాన్ని నేర్చుకొన్న వాడు. అతడు తనను తాను నియంత్రించుకున్న వాడు.

-స్వామి వివేకానంద

"The ideal man is he who, in the midst of the greatest silence and solitude, finds the intensest activity, and in the midst of the intensest activity finds the silence and solitude of the desert. He has learnt the secret of restraint, he has controlled himself."

-Swami Vivekananda

కొంతమంది అందమైన ప్రదేశాల కోసం ఎదురు చూస్తుంటారు. ఇతరులు అందమైన ప్రదశాన్ని తయారు చేసుకొంటారు. -హజరత్ ఇనాయత్ ఖాస్

Some people look for a Beautiful Place,
others make a place Beautiful. -Hazrat Inayat Khan

# {8}. సూఫీజమ్ గగనంలో విహరించే నేను!
## {మౌనం}

"నీ మనస్సులో మౌనంగా ఉండు;
నీ భావంలో మౌనంగా ఉండు;
నీ శరీరంలో మౌనంగా ఉండు.
ఎప్పుడైతే ఇవన్నీ మౌనంగా ఉన్నాయో..ఏమీ చేయకు.
ఆ స్థితిలో సత్యం బహిర్గతమై నీ ముందు
కనబడి "నీకు ఏమి కావాలి?" అని అడుగుతుంది."

-రూమి



మౌన దినం అనేది ఓ తీర్ధ యాత్ర వంటిది.
మౌన దినం అనేది ఆత్మ యొక్క అద్భుత వీణని మరియు
వాయిద్యాన్ని ఆలకించడానికి సహాయపడుతుంది.

-హాఫీజ్

మౌనం మహా సముద్రం.
భాష నది.
మహా సముద్రం నీకోసం గాలిస్తున్నప్పుడు నది వైపు పరిగెత్తకు.
మహా సముద్రాన్ని ఆలకించి నీ మాటల వ్యాపారాన్ని కట్టిపెట్టు.

ఎవరైతే సత్యాన్ని దర్శిస్తారో వారు మౌనం వైపు ఎదుగుతారు.
అలాంటి వాళ్ళల్లో ఏ ఒక్కరితో నీవు ఉన్నా
చప్పుడు చేయకుండా మౌనంగా ఉండు.
అతను మాట్లాడమన్నప్పుడు లోపలి నుండి మాటల్ని బయటకి తియ్యి.
నేను ఈ పద్యాన్ని తీస్తునట్లు.

-రూమి

**ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం**



# {9}. మౌనంలో బుద్ధుడు

ఓ తాత్వికుడు (ఫిలాసఫర్) బుద్ధుడి వద్దకు వచ్చి ఈ విధంగా ప్రశ్నిస్తాడు:
"పదాలు లేకుండా,మాటలు లేకుండా నాకు సత్యాన్ని చెప్పగలరా?"
బుద్ధుడు మౌనంలో ఉండిపోయారు.

కాసేపటి తర్వాత ఆ తాత్వికుడు సౌమ్యంగా లేచి గంభీరంగా ప్రణమిల్లి కృతజ్ఞత భావంతో ఈ విధంగా తన అనుభవాన్ని తెలియచేస్తాడు:
"మీ ప్రేమమయ కరుణతో నా భ్రమలు పూర్తిగా తొలగి వాస్తవ మార్గంలోనికి ప్రవేశించాను."

ఆ తాత్వికుడు అక్కడి నుండి వెళ్ళిపోగానే బుద్ధుడి శిష్యుడు అయిన ఆనంద వచ్చి "గురుదేవా! ఆ తాత్వికుడు సాధించినది ఏమిటి?" అని అడుగుతాడు.

దానికి బుద్ధుడు ఈ విధంగా సమాధానం చెబుతారు:
"కొరడా యొక్క నీడ చేత కూడా ఓ మంచి గుర్రాన్ని నడిపించవచ్చు."

"మౌనమే సత్యం; మౌనమే ఆనందం;
మౌనమే ప్రశాంతత; మౌనమే ఆత్మ.
ఈ మౌనంలో జీవించడమే మోక్షం.
ఇదే జనన మరణ చక్రాలను అంతమొందించేది."
-అవతార్ మెహెర్ బాబా



"వినోబా భావే వంటి సామాన్యులు చెప్పులు కూడా లేకుండా అసమానతకు వ్యతిరేకంగా పోరాడుతూ తోటి మానవుల మీద ప్రేమతో పనిచేశారు. అటువంటి వాళ్ళు నిస్వార్ధ సేవను చేయగలరు.

-అవతార్ మెహెర్ బాబా
(లార్డ్ మెహెర్ పేజి.3773)

## {10}. నా పక్కనే ఉండాలని కోరుకొంటాను

వినోబా భావే తనకొచ్చిన ఉత్తరాలన్నింటిని జాగర్తగా పెడుతుండే వారు. ఒకసారి ఆయనకు గాంధీ రాసిన ఉత్తరం అందింది. ఆ ఉత్తరాన్ని ఆయన చదివి వెంటనే చింపి పారేశారు. అప్పుడు శ్రీకమలనయన్ బజాజ్ ఆయన పక్కనే ఉన్నారు.
జరిగింది చూసి ఆయన ఆశ్చర్యపోయారు. కుతూహలాన్ని ఆపుకోలేక ఆయన చింపిన ఉత్తరం ముక్కలని ఒక క్రమ పద్దతిలో అమర్చి విషయాన్నీ చదివారు. ఉత్తరమంతా వినోబాజి గురించి పొగడ్తలే.

మీకు సమానమైన ఉన్నత మనస్కుడిని మరొకరిని నేనింత వరకు చూసి ఉండలేదు. అని రాసి ఉంది ఆ ఉత్తరంలో.

బజాజ్ ఆశ్చర్యంగా "మీరు ఈ ఉత్తరాన్ని ఎందుకు చింపేశారు? ఉన్న నిజాన్నే కదా బాపూజీ మీకు రాసారు?" అని అడిగారు.

అందుకు వినోబాజి చిరునవ్వుతో ఇలా అన్నారు:

ఈ ఉత్తరం నాకు ఎంత మాత్రం ఉపయోగం లేనిది.
అందుకే నేను ఈ ఉత్తరాన్ని చింపి పారేశాను. బాపూజీ ఎంతో పెద్ద మనస్సుతో
నాలోని సుగుణాలను చూసారు. అదే ఈ ఉత్తరంలో రాశారు.
కాని నాలో ఎన్ని లోపాలున్నాయో ఆయనకేమి తెలుసు?
ఆత్మస్తుతి నాకు బొత్తిగా గిట్టదు. అదే గనుక ఎవరైనా నా లోపాలను ఎత్తి
చూపారనుకో -వారెప్పుడూ నా పక్కనే ఉండాలని కోరుకొంటాను.

# {11}.మౌనం -ఏకాంతం

నీవు ఏకాంతం మరియు మౌనంలో...

పనులు చేయడం ఆపడం నేర్చుకొంటావు.
తయారు చేయడం ఆపడం నేర్చుకొంటావు.

జనాలను (నీకు సంబంధించిన)
సంతోషపెట్టడం ఆపడం నేర్చుకొంటావు.
నీకు నీవు సంతోష పడడం ఆపడం
నేర్చుకొంటావు.

పీడించడం ఆపడం నేర్చుకొంటావు.
ఒకటి తప్ప ఏదైనా చేయడం
ఆపడం నేర్చుకొంటావు.

ఆ ఒకటి ఏమిటంటే భగవంతుడి ముందు
స్వయం దిగంబరంగా ఉండగల్గితే భగవంతుడి
ద్వారా భగవంతుడు దొరుకుతాడు.

-జీసస్ ప్రేమికుడు

## మౌనం -ప్రార్ధన-విశ్వాసం-ప్రేమ-సేవ-ప్రశాంతత

మౌనం యొక్క ఫలం -ప్రార్ధన
ప్రార్ధన యొక్క ఫలం -విశ్వాసం
విశ్వాసం యొక్క ఫలం -ప్రేమ
ప్రేమ యొక్క ఫలం -సేవ
సేవ యొక్క ఫలం -ప్రశాంతత
-మదర్ తెరిస్సా



# {12}. అవతారుడికి ఉపశమనం కలిగించిన ధన్యజీవి -జిమ్ రీవ్స్ (20/8/1923 – 31/7/1964)



**ప్రియతముడు తన ప్రేమికుడితో విన్నవించు కొంటున్న పాటతో కూడిన మాట:**

Be honest with me dear, whatever you do
Remember you're mine dear, so always be true

Wherever you wander, on land or on sea  If you really love me, be honest with me

My poor heart would break dear, if you were untrue Asleep or awake dear, I'll dream about you

For you are my darling, you're all that I see If you really love me, be honest with me Be honest with me dear, whatever you do

Remember you're mine dear, so always be true
Wherever you wander, on land or on sea   If you really love me, be honest with me

నువ్వు ఏమి చేస్తున్నా నాతో
నిజాయితీగా ఉండు ఓ నా
ప్రియతమైన వాడా!
నువ్వు నా వాడివే ప్రియా! కాబట్టి
ఎల్లప్పుడు వాస్తవంగా ఉండు అనేవి
గుర్తుంచుకో.

నువ్వు నేల పైన, సముద్రం పైన
ఎక్కడ తిరుగుతున్నా
నువ్వు నన్ను వాస్తవంగా
ప్రేమిస్తుంటే నాతో నిజాయితీగా
ఉండు.

ఒకవేళ నువ్వు అబద్ధంగా ఉంటె నా
నిరుపేద హృదయం
బ్రద్దలయి పోతుంది.
నిద్రపోతున్నను, మేల్కొన్నను ఓ
నా ప్రియమైన వాడా నేను నీ
గురించే కలలను కంటున్నాను.

నీవే నా డార్లింగ్, నిన్నే నేను చూస్తూ
ఉన్నాను.
నీవు నన్ను వాస్తవంగా ప్రేమిస్తుంటే
నాతో నిజాయితీగా ఉండు.



# {13}. షామ్స్-ఎ-తబ్రీజ్ అందిస్తున్న ప్రేమ యొక్క 40 నియమాలు

## 3 వ నియమం:

నీవు భగవంతుడిని విశ్వంలోని అన్నింటి ద్వారా, అందరి ద్వారా అధ్యయనం చేయవచ్చు ఎందుకంటే భగవంతుడు మసీద్ లకు, యూదుల ప్రార్థనలయాలకు, చర్చిలకు పరిమితం కాదు.

కాని ఇప్పటికి నీవు భగవంతుడి నివాసం ఎక్కడ ఉంది అని ఖచ్చితంగా తెలుసుకోవాలంటే, అందుకోసం అక్కడ ఒకే ఒక్క ప్రదేశం భగవంతుడి కోసమే ఉన్నది -అదే వాస్తవ ప్రేమికుడి హృదయం.

## 4వ నియమం:

బుద్ధి మరియు ప్రేమ అనేవి వివిధ పదార్థాలతో తయారు చేయబడినది.
బుద్ధి మనుష్యులను సంబందాలల్లో,చిక్కుల్లో కట్టి పడేసి, దేనికీ సాహసించకుండా తయారు చేస్తుంది.
కాని ప్రేమ అన్ని చిక్కులను కరిగించి, సర్వస్వాన్ని సాహసిస్తుంది.

బుద్ధి ఎల్లప్పుడూ జాగ్రత్తలను సూచిస్తూ, 'జాగ్రత్త...చాలా తన్మయత్వం' అంటూ సలహాలు ఇస్తూ ఉంటుంది.
కాని ప్రేమ మాత్రం ఇలా పలుకుతుంది: 'మరేం పర్వా లేదు! ఎటువంటి వాటినైనా స్వీకరించు.'
బుద్ధి అంత తేలికగా విచ్చినం కాదు, కాని ప్రేమ మాత్రం అప్రయత్నంగా తనకు తానుగా రాతి ముక్కలుగా తగ్గించుకొంటుంది.
కాని సంపదలు అనేవి శిధిలాల మధ్యనే దాగి ఉంటుంది.
పగిలిన హృదయమే సంపదలను ఉంచుతుంది.

# {14}. సద్గురువు జీవితంలోని సద్విషయములు {దేహమున్న విదేహి జనక మహారాజు }



ఒకరోజు జనక మహారాజుతో ఆయన మంత్రి మాట్లాడుతూ, "మహారాజా! మీరు దేహధారులై ఉన్నారు కదా! మరి మిమ్మల్ని విదేహి అని అందరూ ఎందుకంటారు?"అని అడిగాడు.

అందుకు సమాధానం కొద్ది రోజులైన తర్వాత చెబుతాను అని జనకుడు అన్నాడు.

మంత్రికి అనుభవపూర్వకంగా తెలియ చేయాలని జనకుడు భావించాడు.

ఒకనాడు జనక మహారాజు ఒక దూతను పిలిచి "మంత్రి అపరాధం చేయడం వలన అతడికి ఈ రోజు సాయంత్రం నాలుగు గంటలకి మరణశిక్ష అమలుపరచ బడుతుంది అని నగరమంతా దండోరా వేయమని ఆజ్ఞాపించాడు.

అదే రోజు ఉదయం పది గంటలకి మంత్రిని భోజనానికి ఆహ్వానించాడు.

చెప్పిన సమయానికి భోజనానికి వచ్చాడు మంత్రి. జనక మహారాజు అతడి కోసం ఎన్నో రకాల పదార్థాలు వండించాడు. కానీ కావాలనే దేనిలోనూ ఉప్పు వేయలేదు.

మంత్రి ఆలోచనలన్నీ మరణదండన మీదే ఉన్నాయి. కానీ రాజు గారి ఆహ్వానం కదా, అందుకని తప్పనిసరై భోజనానికి వచ్చాడు.కానీ సరిగ్గా ఏ పదార్థాన్ని తినలేక పోయాడు.

భోజనాలు పూర్తి కాగానే జనక మహారాజు మంత్రితో, "ఏ పదార్థంలోనూ ఉప్పు తక్కువ కాలేదు కదా" అని అడిగాడు.

మంత్రి భయపడుతూ "మహారాజా! మృత్యు భయంతో నేను భోజనాన్ని కొంచెం కూడా ఆస్వాదించలేదు.

ఏ పదార్థం తియ్యగా ఉన్నదో, ఏ పదార్థం పులుపుగా ఉన్నదో, ఏది చప్పగా ఉన్నదో నేను గ్రహించలేదు." అని అన్నాడు.

అప్పుడు జనక మహారాజు "మంత్రి గారూ! భోజనం చేస్తున్నప్పుడే మీకు తెలుసు, సాయంత్రం మీకు మృత్యు దండన అమలు అవుతుందని!

దాంతో మీరు దేహంలో ఉండి కూడా "విదేహు"లై పోయారు.

నేను ఈ శరీరపు ఉనికిని క్షణం కూడా నమ్మను.

అందుకే నన్ను "విదేహి" అని అంటారు.
ఇందులో ఆశ్చర్య మేముంది?" అన్నాడు.




## నాలుక-మనస్సు-హృదయం-ఆత్మ

నాలుక మౌనంగా ఉన్నప్పుడు మనస్సు మాట్లాడుతుంది.
మనస్సు మౌనంగా ఉన్నప్పుడు హృదయం గీతాలాపన చేస్తుంది.
హృదయం మౌనంగా ఉన్నప్పుడు ఆత్మ తన
నిజ స్థితిని అనుభవించడం మొదలు పెడుతుంది.
-అవతార్ మెహెర్ బాబా



# {15}. మౌనం యొక్క స్నేహితుడు

మనం భగవంతుడిని కనుగొనాలి.

అతడిని శబ్దంలో మరియు విశ్రాంతి లేకపోవడంలో కనుగొనలేము.
భగవంతుడు మౌనం యొక్క స్నేహితుడు.

ఆ ప్రకృతిని ఒక్కసారి చూడండి..చెట్లు, పువ్వులు, పొలాలు
ఏ విధంగా మౌనంగా ఎదుగుతున్నాయో!

ఆ నక్షత్రాలను, చంద్రుడిని, సూర్యుడిని చూడండి..
అవి ఎలా మౌనంగా కదులుతున్నాయో!

**మనం ఆత్మలను స్పృశించాలంటే**
**మనకు కావలసినది -మౌనం.**

-సెయింట్ ఫ్రాన్సిస్ అఫ్ అస్సిసి

## మౌనం

మన కోపాన్ని మరియు గౌరవాన్ని సంహరించడానికి "మౌనం" ఒక మార్గం. మన అహంకారాన్ని మరియు స్వార్థాన్ని నిర్మూలించడానికి "మౌనం" ఒక మార్గం. చివరగా మన నిజ స్వరూపాలను సాక్షాత్కరించుకోవడానికి "మౌనం" ఒక మార్గం.

-అవతార్ మెహెర్ బాబా

Lover of God
Lives of Perfect Joy

ఒక్క మాట చెబుతా
వినకు-రాసుకోకు-గుర్తుపెట్టుకోకు
కాని గుండెల్లో పదిలంగా దాచుకో

భగవత్-ప్రేమికుడు
ఆనందమయ జీవితాలు

# మాటలు -పని -మౌనం

నువ్వు మాటగా పనిచేస్తున్నంత కాలం
(మాటలను పెంచే మాటలు ,మాటలుగా మార్చే మాటలు)
మాట్లాడడానికి ఎప్పుడూ మాటలు ఉంటూనే ఉంటాయి,
అలాంటి మాటలు మాట్లాడడానికి వ్యక్తులు ఉంటూనే ఉంటారు.
కాని
నువ్వు మౌనంగా పనిచేయడం
(మాట్లాడించే దానిని మాట్లాడించకుండా చేయడం/
మాటగా మార్చే మాటలు) మొదలుపెట్టిన క్షణం నుండే
ఇక మాట్లాడడానికి మాటలు మిగలవు;
మాట్లాడించడానికి వ్యక్తులు మిగలరు. -సూఫీ

యుగాల నుండి నా సందేశం మరియు శాశ్వతత్వం
నుండి ప్రారంభ రహితమైనది ప్రేమ.
భగవంతుడు ఒక్కడే సత్యం.
అతనిని తెలుసుకోవాలి.
అతినిని ప్రేమించాలి.
భగవంతుడు మనందరిలో సమానంగా నివసిస్తున్నాడు.
అతనికి కావలసినది -అంతర్గతమైన మౌన ప్రేమ.
-అవతార్ మెహెర్ బాబా



ఇది ముగింపు కానే కాదు.
మళ్ళీ భగవంతుడితో మరియు భగవత్-ప్రేమికులతో
కలిసే ఆ అమృత ఘడియల కోసం ఆత్రుతతో
ఎదురుచూస్తూ...
వచ్చే మాసం ఖచ్చితంగా,నిస్సందేహంగా,
తప్పకుండా,మరిచిపోకుండా కలుద్దాం...

ప్రియతమ అవతార్ మెహెర్ బాబా కి జై

mehera.meher77@gmail.com